


థీస్టిక్ ఎండవర్ సొసయిటీ ప్రచురము.

గ్రంథకర్త.

ఇప్పగుంట సుబ్బకృష్ణయ్య.

JYOTISHMATI PRESS, MADRAS

# శీఖుల బలిదానము



ఇది

ఇప్పగుంట సుబ్బకృష్ణయ్యగారిచే

రచియింపఁబడి



ధీ స్లిక్ ఎండవర్ సొసయిటీవారిచేఁ

ప్రకటితము.



జ్యోతిష్మతీ ముద్రాక్షరశాల

చెన్నపట్టణము.



కొలఁది కాలము మాత్రమే

ఇహలోకమున నుండినను

తన యపూర్వ ప్రేమాతిరేక

ముచే, మఱపునకురాని నా

ప్రియసోదరి **ధర్మాంబ**

యొక్క జ్ఞాపకచిహ్నముగ నీ

పుస్తకము ప్రకటితమయ్యె.

# పీఠిక

ఈ చిన్నిపొత్తమును వంగభాషలో శ్రీమతి కుముదినిమిత్ర, బి. ఏ., సరస్వతి గారిచే వ్రాయఁబడిన 'శిఖేర్ బలి దాన'మ నెడి పుస్తకము ననుసరించి నేను తెలుఁగున వ్రాసి బందరులోని "కృష్ణాపత్రిక"లో ప్రథమమున ప్రచురించితిని. ప్రతి మతము నందును ప్రతిదేశమునందును వీర పురుషులును, స్త్రీలును జనించి వారికిఁగల ఈశ్వర భక్తిని, సత్య పరాయణత్వమును కాపాడుకొనవలసివచ్చినపుడు తమదేహ, ప్రాణ, మనోధనములను నవలీలగా నర్పించి తమకుఁగల పారలౌకిక విశ్వాసమును, ఇహలోక సౌఖ్యములందలి నిరసన భావమును తమ

సాహసకృత్యములచేఁ జాటఁగల్గిరి. కావుననే ఆంగ్లభాషయందు 'ధర్మ సాంప్రదాయము లకు పునాది హాత సాక్షుల రక్తముచే వేయఁబడినది'యనెడిసామ్యము వాడుకలోనికి వచ్చినది. ఈ చిన్నపుస్తకమున వ్రాయఁ బడిన శీఖ్ మత వ్యాప్తి యెంతవఱకు ధర్మ వీరుల స్వార్థత్యాగముచేఁ బోషింపఁబడి మనదేశమునం దసంఖ్యములగు ధర్మబీజ ములను వెదజల్లఁగలిగినదో పాఠకులు తెలి సికొనఁగలరు. ఈ పుస్తకము నాంధ్రమున వ్రాయ ననుమతి నిచ్చిన గ్రంథకర్త్రికిని, ఇందలి చారిత్రములను తమ పత్రికలో ప్రచురించి ప్రోత్సాహమొసంగిన శ్రీ కృష్ణా పత్రికా సంపాదకులకును దీనిని పుస్తక రూపమునముద్రింపవలయునని పూనుకొని అతి జాగరూకతతో నాకార్యమును నిర్వ

హించిన థీస్టక్ ఎండవర్ సొసయిటీవారికిని ఇకను నీ గ్రంథములోని భాషా సంబంధిక సంస్కరణముఁ గావించిన నామిత్రులకును కృతజ్ఞతా పూర్వకవందనములు.

సాధనాశ్రమము.
కాకినాడ, మార్చి-1918 } ఇ. సు. కృ.

# శీఖులబలిదానము



## తేగ్ బహాద్దరుని జీవితము.

క్రీస్తు శకము ౧౪౬౯వ సంవత్సరమున
ఖత్త్రి గేసరుఁడగు బాబానానకు జన్మించి
విశ్వజననీధర్మమును స్థాపించెను. దానికి
శీఖుమతమని పేరు. ఆమతము నవలంబించు
వారికి శీఖులు లేక శిష్యులని పేరు. మతబోధ
కుఁడగు నానకునకును, అతని పిదప ఆపద
విని గ్రహించిన ఆమారుదాస్, అర్జునసింగ్,
హరికృష్ణ మొదలగు మతబోధకుల కందఱి
కిని గురువులని పేరు. ఆ శీఖ్ గురువులలో
నానకు మొదలుకొని తొమ్మిదవ గురువగు
తేగ్ బహాదూర్ నుగుఱించియే మనమిప్పుడు

ముచ్చటింపవలసియున్నది. శీఖుమతము దేశ మునందు ప్రచలితములగు కుసంస్కార ములను నిర్మూలముచేసి, జాతిమత వివక్షు తలులేక సర్వమానవులును పరమేశ్వరుని భజించుటకుఁదగినవారనిబోధించుచున్నది. నానకుని మరణానంతరమే మహానీయులు తమయొక్క యచంచలమగు విశ్వాసము చేతను, అతుల్యమగు నాత్మోత్సర్గముచే తను, పంజాబు దేశమంతను గడగడలాడింపఁ గలిగిరో, ఏ మహానీయులు తమయొక్క గొప్ప దృష్టాంతముచేతను తమ యసదృశ చారిత్రముచేతను, ఎట్లుజాతిని సంఘటింపఁ గల్గిరో ఆవారియొక్క శౌర్యమును, వీర్య మును, విశ్వాసమును ఒకానొక సమయ మున ప్రతిభాశాలురగుశిల్లీశ్వరులను సహి తము వడఁకునట్లుచేసినవి. వారే "అలఖ

నిరంజను" నుపాసించుచుండిరో, ఆ పరమ పురుషుని సహాయముచేతనే వారు తమ ధర్మరక్షణార్థము శక్తి సాహసములను బడయఁగలిగిరి.

గురుతేగ్ బహాదూర్ ౧౬౨౨ వ సంవత్స రమున పుట్టెను. అతఁడు పంచమ గురువగు అర్జునసింగునకు మనుమఁడును, ఆఱవగురు వగు హరిగోవిందునకు పుత్రుఁడును. అతఁడు ప్రస్తుతము 'అమృతసార్' అనిపిలువఁబడెడి 'అమృతసరోవరమను' పట్టణమునం దుండె డివాఁడు. ఆఱవ గురువగు హరిగోవిందుఁడు పరమపదమును పొందినతరువాత నాతని పుత్రుఁడగు 'హరిరాయ్' గురుపదము నధి ష్ఠించెను. ఆతనికి తరువాత హరికృష్ణుఁడు గురుత్వమును స్వీకరించి ఎనిమిది సంవత్సర ముల వయస్సునందే విగతజీవుఁడయ్యెను.

అటుపైన ౧౭౧౨ వ సంవత్సరమున మరల ఖానాయకుఁడగు టేగ్ బహదూర్ తన ఏబదిరెండవయేట గురుపదమునం దభిషిక్తుఁడయ్యెను. ఢిల్లీ సామ్రాజ్యాధిపతియొక్క ప్రసాదలాభాకాంక్షులగు పలువురు గురుపదమునకై ఎదురుచూచుచుండిరి. జగద్విఖ్యాతుఁడగు షాజహాన్ చక్రవర్తి ఏడవ గురువుయొక్క పుత్రుడగు 'రామరాయు' ని పక్షమును సమర్థించుటకు పూనుకొనెను. శీఖులందఱును టేగ్ బహదూరునియొక్క ధర్మశీలతకును ఉత్కృష్ట ప్రవర్తనమునకును మెచ్చుకొని అతనినే తొమ్మిదవ గురువుగా నభిషిక్తునిఁ జేసిరి. ఈ సమయముననే మొగలాయి చక్రవర్తియగు ఔరంగజేబు తనతండ్రియగు షహాజహానుని సింహాసనచ్యుతునిగాఁ జేసి, తన సోదరులను జంపి,

ఢిల్లీ సింహాసనము నాక్రమించుకొనెను. ఔరంగ జేబు మిగుల పట్టుదలగల ముసల్మానుఁడు. కావున తనయొక్క మహమ్మదీయ ప్రజలను సంతృప్తిపఱచుటకై హిందువులను నానావిధముల కష్టములను పెట్టుటకు వెనుదీసినవాఁడు కాఁడు. అతని రాజ్యకాలమున అనేక హిందూ దేవాలయములు పడఁగొట్టఁబడి ఆయుపకరణములతో మహమ్మదీయ మసీదులు నిర్మింపఁబడినవి. హిందువులయొక్క కార్యకలాపములను కనిపెట్టి యాతనికిఁ దెల్పునిమిత్తము గూఢచారులు నియమింపఁబడిరి. మఱియు హిందువులను ముసల్మానులనుగాఁ జేయుటకు వివిధోపాయము లవలంబింపఁబడినవి. దేశమిట్టి దురవస్థలో నుండినపుడు, శీఖ ధర్మము అనేక విఘ్నములను సహితము లక్ష్యముచేయక నిర్భయముగ

తలయెత్తి విజృంభింప సాగినది. తేగ్ బహా దూర్ గురుపదమును స్వీకరించి ఉత్తర హిందూస్థానమం దంతయును దేశాటనముం జేయదొడంగెను. ఆమహానీయుఁడు తన దేశ సంచారకాలమున ప్రతిస్థలమునందును మహమ్మదీయ రాజప్రధానులచే హిందువుల యెడలిజరుపఁబడు ఘోరకార్యములకై కుం ది అమృతసరమునకు మఱలివచ్చెను. పిమ్మట అమృతసరమునుండి బయలుదేరి శతద్రు నదీతీరమున 'ఆనందపుర'మనెడి గ్రామమున నివసించుచుండెను. ఆయానంద పురమున నొకానొక దినమున తేగ్బహాదూర్ శిష్య బృంద పరివేష్టితుఁడై యుండ నారలలో నొకఁడు నిలువఁబడి హిందువులయొక్క దు స్థితిని, వారు పడు పాట్లును, తురకలేవిధము గ వారిని హింసించునదియు వివరముగాఁ

చెల్పెను. గురు తేగ్ బహాదూరు క్షణకాల మూరక యాలోచించుచుండి స్వార్థత్యాగ మును జూపుటకుఁ దగిన సమయము తట స్థించినదనియు, స్వార్థమును పూర్తిగా నాశ నము చేసిననేఁ గాని మహమ్మదీయులచేఁ గావింపఁబడు దురాచారములు నివారింపఁ బడవనియు సిద్ధాంతము చేసెను. ఆయన శిష్యమండలి నుద్దేశించి "భక్తజనులారా! ఈశ్వరోపాసకులీ జగత్తున నెన్నియో క్లేశ ములను సహింపవలసియున్నారు. బహు బాధలనొందవలసియున్నారు. దేశమునందు పాపమును అత్యాచారమును వృద్ధియైన యెడల నేదైనయొక ప్రియవస్తువును బలి దానముగఁజేసి, వానిని దూరముచేయుటకు ప్రయత్నములు జరుపఁబడుచుండును. వర్త మాన సమయమున దేశమునకట్టి దురవస్థ

ఘటిల్లినదో మీరు చూచుచున్నారు. ఇట్టి సమయములో మీరే ప్రియమైన వస్తువును బలిగ నర్పించి దానిని పోఁగొట్టఁగలరు?" అని యడిగె. ఆయనయొక్క పంచదశ వర్షీయపుత్రుఁడగు గోవిందసింగు తన తండ్రి మాటలను మిక్కిలి ఆతురతతో వినుచుండెను. ఇట్టి కోమల వయస్సునందే ఆయన యొక్క విశ్వాసము దృఢపడి ఆయనయందు ఆత్మసమర్పణబీజము లంకురించినవి. తేగ్ బహాదూర్ మౌనము ధరించియుండఁగా గోవిందసింగు నిలువఁబడి 'తండ్రీ! శిఖుజనులు మీరున్నే అన్నిఁటికంటెను ప్రియతమవస్తువుగాఁ దలఁచెదరు' అనెను. కుమారునియొక్క యామాటలను తేగ్ బహాదూరును శిష్యమండలియును విని నిశ్చేష్టితులైరి. ఆయన తన పుత్రునిమాటలను తన యభిప్రాయ

మును ఒక్క తీరుగానుండుటను దెలిసికొని యాలోచింపసాగెను. గోవిందుని మాట లలో నేమియో గూఢార్థమున్నదని శిష్య మండలియుఁ దలంచెను. కొంతసేపటికి శి ష్యులారా! పొండు. సామ్రాట్టునకును అతని అనుచర వర్గమునకును శీఖ ధర్మముయొ క్క శ్రేష్ఠతను దెలియఁజేయుఁడు. శీఖ గు రువుల నెప్పుడును వారు ముసల్మానులుగాఁ జేయలేరని తెలియఁ బల్కుఁడు. అని జేగ్ బాహదూర్ చెప్పెను.

జేగ్ బహాదూరుచేఁ జెప్పఁబడిన యీ మాటలు ఔరంగజేబు చక్రవర్తియొక్క చెవినిఁ బడఁగానే అతనిని వెంటనే తన సమ్ము ఖమునకుఁ దెమ్మని యాజ్ఞాపించెను. ఔరంగ జేబు జేగ్ బహాదూరునకు అత్యాదర ముతో ఆతిథ్య మొసఁగి ఆయనను నానా

విధములగు ప్రబోధనలచే ఇస్లాం ధర్మము నందు కల్పుకొనుటకుఁ బ్రయత్నించెను. కాని తేగ్ బహదూర్ యెంతమాత్రమును లొంగినవాఁడు కాఁడు. తుదకు చక్రవర్తి 'నీవేదైన అలోకసామాన్య కార్యమును చూపుము! లేదా ముసల్మాన్ ధర్మమును స్వీకరింపుము. లేనిచో నీశిరచ్ఛేదముకావిం పఁబడు' నని చెప్పెను. తేగ్ బహదూరు అచలిత భావమున నీ రెండు విషయ ములకును ఒప్పుకొనలేదు. ఆయనయొక్క మృత్యువునకు పూర్వము కారాగారములో నుంచఁబడియుండిన కొలఁదిదినములును ధర్మోపదేశములు చేయుటలోను, దానములు చేయుటయందును, ప్రార్థనాదికములు సల్పుట యందును, ఈశ్వరచింతనతోను కాలము గడుపుచుండెను. ఆయన బందె

ఖానాలోనుండి నపుడు బహు హృదయ
గ్రాహకములగు నుపదేశములను రచన
చేసెను. అందులో మూఁటియొక్క సార
మును మాత్రమే యీ క్రింద వివరించెదను.

"ఈశ్వరుఁడొక్కఁడే మనకు సహాయుఁ
డును, ఆశ్రయుఁడును. మనయొక్క మనస్సు
యెల్లప్పుడును ఆయన యందే కట్టుఁబడి
యుండవలెను."

"మానవులయొక్క మనస్సు స్వాభా
వికముగాఁ బాపము వైపులఁ బోఁగోరును.
మహాత్ములయొక్క ఉపదేశముల ద్వారా,
యీమనస్సును అట్టి పాపమార్గములనుండి
మఱలునట్లు చేయవలయును."

"విశ్వాసమును త్యజించుటకంటె మృ
త్యువే మేలని టేగ్ బహదూర్ చెప్పు
చున్నాఁడు.,,

ఆయన మృత్యువునకై యెంతమాత్రము భయఁపడక పోవుటయేగాక యే విధమైన చాంచల్యతను సహితము కనుపఱుపలేదు. ఆయన చనిపోవుదినము ప్రాతఃకాలమున ప్రార్థన జేయుచుండఁగా ఘాతుకులు సమీపించి శిరచ్ఛేదము చేసిరి. ఈ విధముగ భారత వర్షమునందలి ధర్మవీరుని యొక్క మృత్యువు సంఘటిల్లినది. తేగ్ బహదూర్ మతముకొఱకై తన యాత్మను బలిగ నర్పించి జగత్తున ధర్మముయొక్క మహిమను స్థాపించి వెడలి పోయెను. ఆయన మృతినొందిన తరువాత ఆయన మెడలో ఒక కాగితపు తునుకపైని "సర్దియా సిర్ నదియా" అనఁగా నాతలను యిచ్చితిని గాని నాయొక్క విశ్వాసమును విడువలేదని, వ్రాయఁబడి యుండుటనుం గనుఁ గొనిరి.

ఢిల్లీ నగరమునం దేస్థానమున తేగ్ బహాదూరుని హత్యజరుపఁబడినదో ఆస్థానమునకిప్పటికి నిసీసగంజ్ యని పేరు. తేగ్ బహాదూర్‌తోఁగూడ మాతిరామ్ అనెడు మఱియొక శిఖుని ప్రాణముఁ గూడఁ దీయఁబడినది.

తేగ్ బహాదూర్ చనిపోయిన తరువాత నాతనికుమారుఁడగు గోవిందసింగు గురుపథము నధిష్ఠించెను. ఆయన అప్పుడు పదునైదేండ్ల ప్రాయముఁగల బాలుఁడు. ఈతరుణవయస్సునందే యాయన ధర్మవిషయములను గూఢతత్వముల నారయుటకు తగిన యోగ్యతను గలిగియుండెను. ధర్మమును రక్షించుటకుఁ దలపెట్టిన యెట్టి విపత్తులను, క్లేశములను సహింపవలసి యుండునో అవన్నియు నాతని కవగతమై యుండెను.

ఉేగ్ బహదూరుని శిరచ్ఛేదనవార్త సామ్రాట్టగు ఔరంగజేబునకు రాఁగానే ఆయనయొక్క దేహము నేమిచేయవలసినదియుఁ గనుఁగొనుటకై మనుష్యులు చక్రవర్తివద్దకు పంపఁబడిరి. ఔరంగజేబు ఉేగ్ బహదూరుని దేహమునకు సంస్కారము చేయుట కనుమతియ్యక, అది క్రమక్రమము గళితమై జీర్ణించిపోవలసి నట్లుగా నాజ్ఞాపించెను. గోవిందసింహుఁడీ యాదేశమును విని తన తండ్రియొక్క దేహమును నేవిధముగ నైనఁ దేవలయునని దృఢసంకల్పుఁడై ఢిల్లీనగరమునకు వెడలెను. తండ్రియొక్క దేహము విషయమై యింత నృశంసాదేశమును విని యాతఁడు నిశ్చేష్టితుఁడయ్యెను. ఏవిధముగ తండ్రియొక్క దేహము నుద్ధరింపఁగలుగుదునని చింత అతని నస్థిరునిఁ

గఁజేసినది. అతనికి కేవలము కొందఱు అతి దరిద్రులును అశిక్షితులును అగు అనుచరు లు మాత్రమే యుండిరి. వారీ యసమసాహసిక కార్యమును చేయుటకు సాహసింపలేదు. ఎవరాదుర్గమస్థానమునుండి తేగ్‌బహదూరుని దేహమును తేఁగలుగుదురు? ఢిల్లీ నగరమునందలి రాజపథమున నతినిమ్న శ్రేణి శిక్షుఁడును, అతని పుత్రుఁడును గురుగోవిందునితోఁ గలసిరి. వారు గురుగోవిందుని సమీపించి తేగ్ బహదూరుని మృత కళేబరమును కాపాడి తెచ్చుటకై అనుమతినిఁ గోరిరి. వారు 'మహాశయుఁడా! మేము అతిహీనులము. ఈకార్యమును నెఱవేర్చుటకు సంపూర్ణ మనుప యుక్తులమైనను మమ్మా మహత్కార్యమును చేయ నిచ్చుటచే ధన్యులను గావింపు" మనిరి.

గోవిందసింగు యొక్క అనుమతిని పొంది
పితా పుత్రులీ దుస్సాధ్యకార్యమును నెఱ
వేర్చునిమిత్తము వెడలిపోయిరి. కొంత
దూరము నడచినతరువాత ఒకబండి తో
లువానిని చూచి వానితో పరిచయము
చేసి కొనిరి. శకటచాలకుని సహాయ
పరామర్శలచే వారు నిశిరాత్రివేళ ప్రా
కారములతో చుట్టఁబడిన గృహముల
నుండి తేగ్ బహదూరుని దేహమును ఉద్ధ
రించుటకు సమర్థులయిరి. వారు గురువు
యొక్క దేహమును గృహమునుండి ఎపుడు
వెలుపలికిఁ దెచ్చిరో అపుడు కుమారుఁడు
"తండ్రీ! పహారావాండ్రు నిద్రనుండిలేచి
గృహము శూన్యమైయుండుటను కనుఁగొం
దురేని వారు నిశ్చయముగా మన సంగతిని
సామ్రాటునకుఁ దెలుపుదురు. అపుడు చక్ర

వర్తి మనుష్యులనంపి మనకొఱకై వెతకిం
చును. మన మప్పుడు పట్టువడుదుము. కా
వున నీవు నన్ను చంపి గురునియొక్క
మృతకళేబరమునకు బదులుగా నాదేహము
నుంచితివేని నీవు నిర్భయముగా నీస్థాన
మునకు గురునిదేహము తీసికొని పోఁగలు
గుదువు." అని చెప్పెను. అప్పుడు తండ్రి
కన్నీరొలుక 'కాదు' పుత్రకా! నేను వృద్ధుఁ
డను. నన్నే నీవుచంపియిచట నుంచిపొమ్ము.
నీవు చిఱుత ప్రాయము వాఁడవు. నీవల్ల నిం
కను ననేక కార్యములు చేయఁబడవలసియు
న్నవి. నీవు చేయఁదగినవాఁడవగుదువు; ఇటు
వంటి సమయమున నీప్రాణమును పోఁగొట్టు
కొనకుము. నీవు బ్రతికియుండిన దేశమునకు
ఉపకారము కలుగఁగలదు. నీవును సత్కా
ర్యములు చేసి నీజవ్వనమును సార్థకపఱుచు

కొనుము. మఱియు నీవు సబలకాయుఁడవు కావున గురునియొక్క మృతకళేబరమును అవలీలఁగా నిర్దిష్టస్థానమునకు చేర్పఁగల్గుదువు. నావలన నీకార్యము బాగుగా నెఱవేరునట్లు లేదు. కావున నీవే నన్ను చంపుమని చెప్పి పుత్రునిచేతికి ఒక కత్తినిచ్చెను. కాని పుత్రుఁడేవిధముగ ముసలితనముచే నిండిన తండ్రిని చంపుటకు పాల్పడును? అతఁడు నిశ్చలభావమున నిలువఁబడియుండ తుదకు తండ్రి పుత్రునియొక్క మనోభావమును కనిపెట్టి కత్తిని తనచేతిలోనికిఁదీసికొని తనంతటతానే ప్రాణమును గోల్పోయెను. మృత్యుసమయమున నావృద్ధుఁడీ క్రింద వివరించినరీతిఁ ప్రార్థనచేసెను.

ఎవరు వ్యాకులభావముతో ప్రార్థన చేయఁగలరో వారికిఁగల దుఃఖములును

క్లేశములను నన్నిఁటిని ఓపికతో సహించఁ గల్గుదురు. వారిముఖములు ధర్మజ్యోతితో ప్రతిభాతమగుచుండును. మఱియు వారుద్ధరింపఁ బడుదురు.

ప్రార్థన చేసిన తరువాత పుత్త్రుఁడు తన తండ్రియొక్క మృతదేహము గుడ్డలతో జుట్టిపెట్టి తేగుబహాదూరుని దేహమును దీసికొని నిరాపదతో స్వస్థానమునకు వెడలెను. ధర్మవిశ్వాసమన్న నిట్టిదేగదా! అటువంటి వీరపురుషుల కాటపట్టయిన మన భారత భూమియందు నేఁటి కాలమునకు సత్యాన్వేషణు లరుదైరిగదా! ఈశ్వరోద్దేశము నెవరెఱుఁగఁ గలరు?

---

గురుగోవిందసింగుని పుత్రులు.

# అపూర్వత్యాగము.



## శీఖ్ ధర్మము.

పదియవ గురువగు గురుగోవిందసింగు గారి ప్రయత్నముచేత శీఖులు ప్రబలమయిన పరాక్రమశాలురతోఁగూడిన జాతిగాపరిణమించిరి. శీఖ్ ధర్మము భారతవర్షమున అపూర్వ ప్రభావముతో దేశమునందు విస్తరించినది. గోవిందసింగు తనయొక్క సత్ప్రవర్తనతోఁ గూడిన తేజస్సుతోడ, శీఖులమధ్య ధర్మబీజములను మిక్కిలి దృఢరూపముగ నాటుకొను

నట్లు చల్లుటకు శక్తిమంతుఁడయ్యెను. ఆ యన సత్యధర్మమును సంస్థాపించు నుద్దేశ్యముతో మనమర్యాదలను, ధనధాన్య సంపత్తిని, సర్వస్వమును విసర్జించెను. గురుగోవింద సింగుయొక్క ఆంతరిక ప్రయత్నములకు ఫలముగా బహుజనులు శిఖ్ ధర్మమును అవలంబించిరి. చక్రవర్తియుఁ దదనుచరులగు ముసల్మాను ఉద్యోగులును ఈస్థితిఁగనిపెట్టి, దీనికంతటికిని మూల కారకుఁడగు గోవిందసింగు, తానుచేయుకార్యములయొక్క ఫలితము ననుభవించితీరవలయునని స్థిరపఱచుకొనిరి. ౧౭౯౦ వ సంవత్సరమున హఠాత్తుగ నొక దినమున ఒక దళము ముసల్మాను సైనికులువచ్చి గోవిందసింగుయొక్క వాసస్థానమగు ఆనందపురమును ముట్టడించిరి. ఈ యాకస్మికముగు

విపత్తు వలన సాహసవంతులగు శీఖులయొ
క్క భావిస్థితినిగూర్చి సింగు చింతించుచు
వ్యాకులుఁడయ్యెను. ఆతని కేమి చేయవలసి
నదియు తోఁపకయుండెను. ఒక వేళ కొందఱు
యుద్ధవీరులను ప్రోగుఁ జేసికొని శత్రువ్యూహ
మున్ను భేదించుదమనుకొన్న, ఆకార్యము
చేత నిశ్చయముగా శీఖులందఱును సమూ
లముగా నాశనమగుదురు. అంతటితో శీఖ్
ధర్మమును కాపాడువారెవరును నుం
డరు. అటుగాక శత్రువులకు ధనమును,
ప్రాణములను, మానమును అర్పణచేయు
దమన్నను, మిక్కిలి కఠినమయిన కార్యమే.
కావున ఇంతకంటె మృత్యువే మేలు. అని
గోవిందసింగు తనలో తాను వితర్కించు
చుండ మహమ్మదీయుల పక్షమునుండి ఒక
దూతవచ్చి ఆతనితో "మీరు తక్షణమే

ఆనందపూరును వదలివెళ్ళినయెడల మీకే మియు నష్టముగలుగనేరదు" అనిచెప్పె ను కాని గోవిందసింగు ఈదూతయొక్క మాటలందు నమ్మిక ముంచకపోయినను గత్యంతరములు లేనివాఁడై ఆస్థలమును వదలి పెట్టుటకొప్పుకొనెను. మఱుసటిదిన మున వారందఱును ఆనందపూరు వదలి కొంతదూరముపోయిన తరువాత మునల్మా నుల సైన్యమువచ్చి శీఖులనందఱిని చుట్టు కొనెను. శీఖులీ యచింత నీయమగునాప దచే హతబుద్ధులయి ఎవరికిఁ దోఁచినట్లు వారుపోయిరి. కాని అనేకులు మహమ్మ దీయ సైనికులచే హతులైరి. మఱియుఁ బెక్కుమంది శతద్రునదీ గర్భమునఁబడి ప్రాణములను గోల్పోయిరి.

గురు గోవిందసింగును, ఆతని పెద్ద కు-

మూరు లిద్దఱును, మఱికొందఱు విశ్వాస
పాత్రులగు ననుచరులను వెంటఁబెట్టుకొని
రూపనగరమువైపు నడచిరి. ఆయనభార్య,
కొందఱు సాహసవంతురాండ్రగు శీఖరమ
ణీమణుల సహాయముచే ఢిల్లీనగరమును చే
రెను. ఇఁకగోవిందసింగునివృద్ధమాత యగు
ఫతేసింగు జరవాల్ సింగు అను ఇద్దఱు
పౌత్త్రులను తీసికొని తన వంటబ్రాహ్మణు
నితోఁగూడ వానియింటికిఁ బోయెను. కాని
యెవరియందలి విశ్వాసముచే నాముసలిది
అసహాయులగు నిద్దఱు కుఱ్ఱవాండ్రను తీసి
కొని యాతని యింటనుండెనదో యావిశ్వా
సఘాతుకుఁడగు బ్రాహ్మణుఁడు ఆకుమారుల
ఒడళ్లపై మణులతోడను, ముత్యములతో
డను, పొదుగఁబడిన నగలనపహరించి యా
నిరాశ్రయులగు బాలుర నిరువురిని అచ్చటి

ముసల్మాను శాసనకర్తయగు వాజీరుఖాన్ కు ఒప్పజెప్పెను. వాజీర్ ఖాన్ నకు గురుగోవిందునిపై లోలోపల క్రోధము కలదు. పేదకు పెన్నిధియబ్బిన చందమున బాలకులనిద్దఱిని వశముఁజేసికొని నిర్దయుఁడును మమకార రహితుఁడునగు వాజీర్ ఖానుఁ డుప్పొంగి గురుగోందునిపైఁ బగతీర్చుకొనుట కిదియే తరుణమనియెంచి మిక్కిలి యానందించెను. "నేను వీరిని చంపను. కాని వీరలను ముసల్మానులనుగఁ జేసెదను. గురుగోవిందసింగుయొక్క పుత్త్రులను తురకలనుగఁ జేయుదునేని తద్వారా నాతనికిఁ గలుగునంత బాధమఱియొకవిధముగఁ గలుగ నేరదు. నాకు గోవిందసింగును గుఱించి తెలియును. అతని పుత్త్రులు చనిపోయినయెడల దుఃఖమును పొందుననుట వాస్తవమేగాని,

ఆతనిపుత్త్రులే మతాంతరులయినచో నాతని యొక్కబాధ సహింపఁగూడనిదగు"నని వాజిరుఖానుఁ డనుకొనెను. మనస్సునందీ విధముగాఁ దలఁచుచు వాజీరుఖానుఁ డాబాలుర నిద్దఱిని తనవద్దకుఁ బిలిపించెను. కొన్నిదినములనుండి భోజనము లేకయుఁ జూచువారు లేకయు పడియుండిన సుకుమారులగు నాబాలురు మిక్కిలి దుఃఖములో మునిగియుండుటచే వారు వాడిపోయిన కలువ పుష్పములవలె కనుపడిరి. ఆసోదరద్వయము దర్బారు గృహమును ప్రవేశించుటతోడనే అచ్చటనుండిన యొక రాజకీయోద్యోగి "సింహాసనముమీఁద నవాబు సాహేబు విరాజిల్లుచున్నాఁడు. వారిని చూచి సలాముచేయుఁడ"ని చెప్పెను. అందులకా సింగులు "అకాలపురుషుఁడగు నొక్క పర

మేశ్వరునికితక్క తక్కినవారిముందల మేము తలవంపఁ జాలమనని ప్రత్యుత్తర మిచ్చిరి. ఆహా! ఆబాలురయొక్క ధైర్యము! ఆ బాలుర కెంత ధర్మవిశ్వాసముండిన ప్రాణమును దీసివేయునంతటి కఱకు తురకని సమక్షమునసహితము నిర్భయముగా ఈశ్వరుని నామమ్మును స్మరించుచు, అధికారాంధుఁడయిన యానవాబును ధిక్కరించఁ గల్గిరి!

వాజీరుఖానుఁడు వారలను బిలిచి "మీ తండ్రి అధర్ముఁడు. ఆతని కార్యములు కుమార్గములు గావు; కాని మీరు నిర్దోషులగు శిశువులు; మీయొక్క యవస్థఁ జూచిన నాకు జాలి వేయుచున్నది. మీరు ఇస్లాం ధర్మమునందు ప్రవేశింతురేని మిమ్ములవిముదలఁ జేసెదను. మఱియు మీకు వయస్సు వచ్చిన

లమయిన తరువాత 'వాజీర్ ఖాఁ? మేము శీఖ వంశోద్భవులమని నీకుఁ దెలియదా? ఏమి ? మేము గురునానకునియొక్క వంశధరులము. మేము బాలకులుగా నుండుటఁ జూచి మాకు ధర్మబలము లేదనితలఁపకుము. మేము గోవిందసింగుని పుత్రులము. మేమా మృత్యువునకు భయపడువారము? నీ యిష్టమువచ్చినట్లు నీవు చేసికొనవచ్చును. మేముమాత్రము మృత్యువునకు వెఱచి యెప్పుడును స్వధర్మమును గోల్పోమని మాత్రము నిశ్చయముగాఁ దెలిసికొనుము. ప్రాణము కొఱకా ధర్మమును గోల్పోవుట? లేదు! లేదు! ముమ్మాటికిని అటులపొసఁగనేరదు' అని పల్కిరి ?

«ఎవఁడు సృజనకర్తయగు పరమేశ్వరుని వదలిపెట్టునో వాఁడు మృత్యువునకు

భయపడును. ఎవరియొక్క హృదయమున ఈశ్వరానురాగము జనించునో అతనికి మృత్యువు సజీవన లాభకారియగును. మరణమునకు జగత్తునందలి యెల్లవారును భయపడుదురు. కాని నాయొక్క మనస్సు మృత్యువును జూచి మిక్కిలి యానందించుచున్నది. నేను మృత్యువునందే పూర్ణానందమును బొందెదను." అని శీఖ్ ధర్మమున చెప్పఁబడియున్నది.

ఆబాలుర నోటినుండి యెటు వంటి అమృత ధారలొలుకుచుండినవో చూడుఁడు! వాజీర్ ఖానుఁడు క్రోధముచేత పండ్లు పటపటఁ గొఱుకుచు తక్షణము ఘాతుకులను బిలిపించి యాబాలకుల నిద్దఱిని ఒక్క గోడలో పూడ్చివేయ వలసినదని యాజ్ఞాపించెను. ఆఘాతుకులు ఆబాలుర

నిద్దటిని నగరము వెలుపలికిఁ దీసికొని వెళ్లి నగరము చుట్టునుండిన ప్రహారీ గోడలలో నొక చోటఁబగులఁగొట్టి, యాపడఁగొట్టిన స్థానమున నాబాలురను నిలువఁబెట్టి మఱల నాగోడ గచ్చుతో మూసివేసిరి. బాలురు, నడుముపర్యంతము పూడ్వఁబడిన తరు వాత వాజీర్ ఖానుఁడు మఱల వారిని బిలిచి "హతభాగ్యులారా, ఇప్పుడయినను ఆలోచించి చూడుఁడి! ఒక వైపున ధనము సంపదయును ఇస్లాం ధర్మముయొక్క ఆశీ ర్వాదమును, మఱియొకవైపున మృత్యు వును అభిశాపమును నున్నవి. ఇందులో మీరు దేనిని యాలింగనము చేసికొందు రు?" అనియడిగెను. అందులకు గోవిందసిం గుని పుత్రులు "దురాత్ముఁడా; నీవంటి బర్బ రుఁడును, క్రూరకర్ముఁడునగు మానవునిమత

మును స్వీకరించుటకంటె మాకు మృత్యు వే శ్రేయమని తోఁచుచున్నది. మేమేదిన మున నే ధర్మమునకై ఆత్మోత్సర్గము చేయు చున్నామో, దానియొక్క భైరవనాదము శీఘ్రముగా పంజాబు దేశమంతయును బ్రతి ధ్వనించునని మనస్సునందుంచు కొనుము. మీయొక్క రాజత్వకాలమునకు అవసా నము దాదాపు మీదురాచారములవల్ల నే సమకూడునని స్పష్టముగా చూచుచున్నా ము. మఱియు, పంజాబు దేశమంతయు ముసల్మానుల రక్తముచే విధేతమగు"న నిచెప్పిరి. వాజీర్ఖానుని పాషాణహృదయ మీవాక్యములచే కంపింప సాగెను. అతఁ డింక నాస్థానమున నిలువలేక పోయెను.

ఈవిధముగా నిర్దోషులగు నిసువురు శిశువులు తమప్రాణములను బలిగ నర్పిం

చిః. ధర్మ బలముగలిగిన వారలలో ధర్మ
పిపాస యుండిననేగాని, తేజస్సును, విశ్వా
సముద్వారా వారలహృదయము ఘటితమ
యినఁగాని కేవలము శిశువులగు వీరు తమ
ప్రాణముల నర్పింపఁగల్గుదురా! వారలయొ
క్క మృత్యుసంవాదము వారిపితామహికిఁ
దెలియఁగనే ఆమె భూతలమునఁ బడి మూ
ర్ఛితురాలయ్యెను—ఇఁకఆమెకు చైతన్య
ము రాలేదు. ఆహా! శీఖధర్మముయొక్క
శక్తి! వారికాశక్తిం అధ్యాత్మకోపాసనము
వలనఁగాక మఱెట్లు లభించఁగలదు?



# మణిసింగునిచరిత్రము.



యమునా శతద్రునదుల మధ్యప్రదేశ మునకు ప్రాచీనకాలమున మాల్వారాజ్య మనిపేరు. ఆమాల్వారాజ్యాంతర్గతమగు కివో యాల్ నామకగ్రామమున భికాయనుపేరు గల నొకకృషికుఁడు వాసము చేయుచుం డెను. వానికి ఐదుగురు పుత్రులుండిరి; అందులో జ్యేష్ఠునిపేరు మణి. దాదాపు ౧౩౦ సంవత్సరములకు పూర్వ మీకివో యాల్ అనెడి గ్రామము అహమద్‌షా అబ్దాలిచే వినాశము చేయఁబడినది.

గురుగోవిందసింగు ప్రథమమున ధర్మ ప్రచారార్థమై మాల్వారాజ్యమునకు వెళ్ళి

నపుడు అచ్చటి జనులనేకులు వారి ధర్మోప దేశములను వినుటకువచ్చిరి. వారిందఱితోఁ బాటు భికాయును తనకొమారుఁడగుమణిని వెంటఁబెట్టుకొని గోవిందసింగునుజూచుటకు వచ్చెను. కొన్ని దినములు శీఖ్ గురువుయొ క్క యుపదేశములు విని, భికా గృహాము నకు తిరిగి పోఁదలఁచి నపుడు మణి తనతండ్రి వెంటఁబోవుటకు సమ్మతించ లేదు. అపుడు మణియొక్క వయస్సు పదిసంవత్సరములు మాత్రమే. అంతపిన్నవయస్సునందు ధర్మ బుద్ధివికసింప లేదు. అతఁడు గురుమందిరమున తయారగు పాయసాన్నముతన స్వగృహాము న సిద్ధమగు దానికంటె నతి సుస్వాదముగ నుండుటచే తా నెల్లప్పుడును గురువువద్ద నుండుననియు నిఁక ఇంటికిరానని యుఁ జెప్పు చుండెడివాఁడు. భికా తనకొమారుఁడు కొ

న్ని దినములుండిన తరువాత ఏటికి రాఁడను కొని ఆచిన్న కొమరుని గురువువద్ద విడిచి వెళ్ళెను. కాని మణి మాత్రముమఱల గృహ మునకుఁ బోలేదు. గోవిందసింగు ఆ కుఱ్ఱ వానిని గంథముతీసి సువాసనద్రవ్యములను సేకరింప నియమించెను; అతఁడును ఆనంద చిత్తుఁడై ఆపనిని చేయుచుండెను. గురుగో విందసింగు ఆకుఱ్ఱవానియొక్క శ్రీద్ధా భక్తులకు సంతసించి ఆతనియందనురాగ ము హెచ్చినవాఁడయి వానికి సింగను బిరు దము నిచ్చెను. గోవిందసింగుయొక్క సన్ని ధానముననుండి విద్యయు ధర్మోపదేశము లను బడసి వయసువచ్చిన పిమ్మట గొప్ప పండితుఁడనియు ధార్మిక బుద్ధిగలవాఁడనియు ప్రతీతిఁగాంచెను. మణిసింగు చాలకాలము అవివాహితుఁడై ధర్మప్రచారముచేసి యనే

కులను శీఖ్ మతమున ప్రవేశ పెట్టెను. ఆయ
నయొక్క యుపదేశము లతిశయచిత్తాకర్షక
ములుగా నుండెడివి. ఆయనలోని విశేష
త్వము ఆతనికి జనులను విశేషరూపమున
చిత్తాకర్షణచేయుశక్తియే. ఆయన సంస్కృ
త పారసీ గురుముఖీ భాషలయం దసమాన
పాండిత్యమును సంపాదించెను.

ఆయనయొక్క వృద్ధాప్యమున అమృత
సరమునందు ధర్మసంబంధమైన యొకయుత్స
వమును సమకూర్పవలయునని కోరెను.
అతఁడుమిక్కిలిమధురభాషియు సదాశ్రయ
పురుషుఁడునయి యుండెను. ఈకారణమున
నాతని యందు హిందూముసల్మానులగు
రాజకీయోద్యోగు లందఱికిని సద్భావ
ముండెడిది. ఆయన యాధర్మోత్సవమును
సమకూర్చు నుద్దేశ్యముతో లాహో

రులోని మహమ్మదీయ శాసనకర్తయొక్క యనుమతినిఁగోరెను. శాసనకర్త ౫౦౦౦ రూప్యముల నిచ్చినసేగాని ధర్మోత్సవమును నడుపుటకు వీలులేదనెను. ఉత్సవమున కనేకులుభక్తులువత్తురుగాన వారిచేనియ్యఁబడు కానుకలద్వారా సునాయాసముగా౫౦౦౦ రూప్యములను జమచేయనగునని తలఁచెను. కావున శాసనకర్తయొక్క యాజ్ఞకుబద్ధుఁడయి యుత్సవమును సంఘటించు నుద్దేశ్యముతో శిఖ జనులకందఱికిని యాహ్వానముఁబంపెను. క్రమముగా నుత్సవదినము సమీపింప గుంపులు గుంపులుగా శిఖ జనులు ఉత్సవము జరుగనున్న స్థలమునకుఁ జేరుచుండిరి. చతురుఁడగు నామహమ్మదీయ శాసనకర్త యాసమయమున శిఖులనాయకుల నందఱిని తరిమివేసిన మిగుల నానం

దింపవచ్చునని తలంచి ఒకదళము సైన్యమును ఉత్సవప్రదేశమునకుఁ బంపెను. సైన్యము యొక్క యాగమన వార్త శిఖులు వినినంత మాత్రమున దారిలో నుండువారు దారిలో నున్నట్లుగనే తిరిగి స్వగ్రామములకుఁ బాఱి పోయిరి; కావున నా యుత్సవము జరుగక పోయెను. ౫౦౦౦ రూప్యములను పోగు చేయుటెట్లు? పాపము మణిసింగు మిక్కిలి దురవస్థపాలుగావలసి వచ్చెను! రూప్యములను శాసనకర్తకు చెల్లించవలసిన దినము గడచినది. శాసనకర్తయును ౫౦౦౦ రూప్యములను వెంటనే బంపఁగోరుచు మనుష్యులను మణిసింగు వద్దకుఁ బంపెను. కాని మణిసింగు మిక్కిలి బీదవాఁడగుటచే నాతఁడెట్లు ౫౦౦౦ రూప్యములను చెల్లించఁగలఁడు? కావున రూపాయల నియ్యలేక పోయెను.

చివరకాతనికిగొలుసులనుదగిలించి ఖైదీగాఁ
జేసి లాహారు నగరమునకుఁ దీసికొని
పోయిరి. “నేను ఉత్సవమునుండి రూప్య
ములను సంగ్రహించి మీకు చెల్లించఁగల్గు
దునని తలఁచితిని. కాని రాజకర్మచారుల
యొక్క యపరాధమువలన నుత్సవము
కూడుట కవకాశము లేకపోయినది. కావున
నేను రూపాయల నియ్యలేద”ని చెప్పె
ను. ఆ మాటలను ముసల్మాను కర్మచా
రులు వినిపించుకొనక పోవుటయేగాక
యాతనిని పెక్కువిధముల బాధింపఁజొచ్చి
రి. తుట్టతుదకు మణిసింగు ముసల్మానుధర్మ
మును స్వీకరించిన వదలివేయఁబడునని యా
తనికిఁ దెలియఁజేసిరి. మణిసింగు ముసల్మానగు
వాఁడా? శైశవమునుండి యెన్నియో
కష్టములపాలయి యెన్నింటినో క్లేశముల

సహించి పోషించినటువంటి స్వకీయ ధర్మ
మును కేవలము మృత్యువునకు భయపడి
వృద్ధాప్యమునఁ గోల్పుచ్చునా? ఆయన
మేఘగర్జనముతోఁ దుల్యమగు స్వరమున
శాసనకర్త యెదుటనుండిన శీఖ్ లనుజూచి
"ఈదేహము అశ్వరము. నేఁడు స్వధ
ర్మత్యాగముచేసి యీదేహమును కాపాడు
కొందునేని రేపైనఁ దప్పక మృత్యువు వాతఁ
బడవలసినదే. కావున ఘాతుకులయొక్క కత్తి
నా యవినశ్వరమగు నాత్మను భేదింపఁగల
దా?" యని పల్కెను. కట్టకడకు శూలము
తో నాతని దేహమునందలి సన్ధిస్థానముల
నన్నింటిని భిన్నముగావించిరి. ఆది గ్రంథము
లోని ధర్మోపదేశగీతములను స్మరించుచు
నీ మహాపురుషుఁడు అనంతధామమున
కేగెను.

నైనం ఛిన్దన్తి శస్త్రాణి
నైనం దహతి పావకః।
నచైనం క్లేదయంత్యాపో
నశోషయతి మారుతః॥ గీత. ॥



# అపూర్వస్వార్థత్యాగము



## హకికత్ రాయి చరిత్రము.

ముసల్మానుల ప్రభుత్వ కాలములో భారతవర్షంబున పారసీ రాజభాషగా నుండెను. రాజకీయ వ్యవహారములు నల్పుటకును దొరతనము వారి క్రింద నుద్యోగములలోఁ బ్రవేశించుటకును ప్రస్తుత మేవిధముగ నాంగ్లేయభాషా పరిచయముండి తీరవలయునో యావిధముగనే మహమ్మదీయ పరిపాలనమున ప్రతివారును పారసీ భాషనభ్యసింప వలసియుండిరి. పారసీ భాషాజ్ఞానములోఁ బా లెవరయిన నారబీ

భాషను సయితము నేర్చియుండినయెడల వారు మిక్కిలి సన్మాన పాత్రు లగుచుండిరి. ఈకారణముచే నాకాలమందలి హిందూ మహమ్మదీయ బాలురకందఱికిని పారసీక ము నేర్పుచుండిరి. అందువలన బాలురం దఱును పారసీక భాషా పారంగతుల్లగు మ హమ్మదీయుల వద్ద విద్య నభ్యసించుచుండిరి. పంజాబుదేశమందలి శియాల్ కోట యనెడి నగరమునందు క్రీస్తుశకము ౧౭౦౫ వ సంవ త్సరమున ఒక మహమ్మదీయపాఠశాలలో హకీకత్ రాయ్ యనెడి ఏఁడు సంవత్సర ములశిశు బాలుఁడు విద్య నభ్యసించుచుం డెను. హకీకత్ యేఁడు సంవత్సరముల కాలము మిక్కిలి మనోవేగముతో నీ విద్యాలయమున విద్య నేర్చుచుండెను. ఇట్లుండ నొకానొక దినమున ఉపాధ్యాయుఁ

డు లేనిసమయమున నాపాఠశాలలోని ము
సల్మాను విద్యార్థులు హాకికత్ విషయమై
యసద్వ్యవహారములు సల్పి ఆతనియొక్క
మతమునుగూర్చి హేయముగ మాటలా
డిరి. వారట్లుతనమతమును నవజ్ఞ చేయుచుం
డుటను జూచి సహించనేరని హాకికత్ తన
బుద్ధికుశలతచే యుక్తియుక్తముగ నా మ
హమ్మదీయ సహపాఠకులతో వాదించెను.
అంతట నుపాధ్యాయుఁడు పాఠశాలకు
వచ్చినపిమ్మట ముసల్మానులగు తోడిబాలు
రందఱును హాకికత్ మహమ్మదీయ మత
మును దూషించునట్లు ఆతనిపై నేర
ము మోపిరి. అందున కా యుపాధ్యాయుఁ
డతిశయ క్రోధాన్వితుఁడై "నీవు ముసల్మా
నుల మతమును నిందించితివా" యని య
డుగ "అవును, నేనునిందించిన మాట వా

స్తవమే. కాని ప్రథమమున మహమ్మదీయ బాలురే నే నుపాసించు నేకమే వాద్వితీయుఁడగు పరమేశ్వరుని నిందించిరి. కనుక నేను వారి మాటలకు సహింపనేరక నిందించితి"నని నిర్భయముగా నుత్తరమిచ్చెను. అందున కా యుపాధ్యాయుఁడలిగి చీత్కారముచేసి "ఓ కాఫరుఁడా! నీవు దీని ప్రతిఫలమును అనుభవించి తీరవలయు" నని చెప్పి ఈవిషయమును గూర్చి యానగరపు కాజీకి తెలియఁజేసెను. ఆకాజీ యన్ననో యతి కఠినుఁడును దుర్దాంతుఁడు నగుటచే వాఁడు వెంటనే హకికతునిని సంకెలలు వేయించి కారాబుద్ధునిగఁ జేసెను. శియాల్ కోటకు శాసనకర్తయయిన అమీర్ బేగు మిక్కిలి బుద్ధిమంతుఁడును దయాళువునై యుండుటవలన నేవిధమున నయినను హకిక

తునుకాపాడవలయుననెడి యుద్దేశ్యముతో
ననేకప్రయత్నములను జేసెను. ఎంతమా
త్రమును సఫలమనోరథుఁడుకాకపోయెను.
కాజీయును న్యాయవేత్తలగు ముసల్మాను
లనేకులు గూడి విచారణను జరిపించి హాకీక
తునికి మరణదండనమును విధించుచు ఆతఁడు
ముసల్మాను మతమును స్వీకరించినయెడల
దండనము లేకపోవుననెడి మాటను గూడ
హాకీకతునికిఁ దెలియఁజేసిరి. కాని హాకీయా
ప్రాణమునకై స్వధర్మమును కోల్పుచ్చు
వాఁడు? అతఁడెంతమాత్రము మహమ్మదీయ
మతమును స్వీకరించుట కొప్పుకొనలేదు.

హాకీకతుని యొక్క స్నేహశీలురగు
మాతాపితలు ఈ దుర్భర విషాదవార్త
ను వినినంతమాత్రమున నిశ్చేష్టితులయిరి.
ఏముద్దు కుమారుని వారు ప్రాణపదముగఁ

జూచుకొనుచు ఒక్క పుత్రుఁడగుటచే గా
రాబముగఁ బెంచుచు తమయొక్క గౌర
వమును ప్రతిష్ఠను గాపాడుకొనఁ దలఁచు
చుండిరో, ఏ సుకుమారుని యానందమునే
తమ యానందముగను ఎవని దుఃఖమునే
తమ శోకముగను నెంచుకొనుచు తమ
సుఖసంతోషముల కాకరమగు నాచిఋత
ప్రాయుని దయావిహీనులయి చంపుట
యా? హా! వారెంతటి కఠినబాధల కయి
నను సహించి హాకికతుని, ప్రాణమునకు
బదులు ఒకవేళ తమ ప్రాణముల నయి
నను నర్పించ వలసినయెడల సిద్ధముగ
నుండిరి. ఆబాలుని తల్లి, కాజీయొక్క
రెండు కాళ్లను బట్టుకొని మిక్కిలి వినీత
భావముతో పలువిధముల పుత్ర సంరక్ష
ణార్థియై ప్రార్థించెను. తమయొక్క సర్వ

స్వామును కోఁరినను ఇచ్చుటకు సిద్ధపడిన యాభాగ్య విహీనులగు మాతాపిత లెంత వేఁడినను పాషాణ సదృశ హృదయుఁడగు నాకాజీయొక్క మనసు కరఁగదయ్యెను. తుట్టతుదకా ప్రేమ పూరితయగు జనని యుపాయాంతరము గానక హాకికతుని స మీపించి "వత్సా" నీవేల యీవిధముగ మృత్యువును ఆలింగనము చేసికొనుచు న్నావు? నీవు ముసల్మానుఁ డవుకమ్ము. బ్రతి కియుండినయెడల మహమ్మదీయుఁ డవయిన ను తల్లియొక్క శాశ్వతానంద మునకును, గౌరవ మునకును కారకుఁడగుదువు. కు మారా! నన్ను వదలి వెళ్లవలదు. నీవు తక్క నాకెవరును లేరు" అని కన్నీరు మున్నీరు గాగ నేడ్చెను. హాకికతుఁ డశ్రుపూరిత లోచనుఁడై "అమ్మా! కాదు, అటుల పొసఁ

గ నేరదు; ఈశ్వరుని యెడల నే నెప్పుడును అవిశ్వాసిని కానేరను; నేను శిఖ వంశమున కెప్పుడును కళంకము తేను; ధర్మత్యాగ మునకంటె మృత్యువే నాకు శ్రేయస్కరము. నీవు నాయొక్క శరీర విషయమై యాలోచించవలదు. ఏవిధముగా నాయొక్క పరమాత్మ సుఖపడునో దానినే యాలోచింపు" మని చెప్పెను. ఈమాటలను విని హకీకతుని తల్లి మూర్ఛితురాలయ్యెను. ఇంక హకీకతుని తండ్రియు నా మరణరంగమును జూడవచ్చిన అనేకహిందువులును న్యాయాధీశుఁడగు అమీరుబేగును వేఁడియు, ఆతఁడెంతో హకీకతుని ప్రాణరక్షణార్థమై ప్రయత్నపడియుఁ గార్యము లేక పోయెను. అమీరుబేగును హకీకతుని ముసల్మాను ధర్మమును స్వీకరించి తలి

దంద్రులను సంతోషపెట్టుమనెను. కాని స్వధర్మ త్యాగమున కేమాత్రమును నొడఁబడని భక్తవీరుఁడగు హాకికతుఁడందుల కొప్పు కొనలేదు. చివరకు ఘాతుకులచేతి ఖడ్గముచే చిఱుతప్రాయమువాఁడగు భారతవీరునిమస్తకము భిన్నము చేయఁబడెను. ఏభగవానుని ప్రీత్యర్థముగ నా బాలుఁడు తనప్రాణమును ఆనందముతో నుత్సర్గము చేసెనో యాపరమ మంగళస్వరూపునితో నాతని యాత్మ ఐక్యమాయెను.

ఆహా! హాకికతుని ఈశ్వర విశ్వాసము! ధర్మనిష్ఠయనిన నిట్టిదే గదా! మనదేశమున నెందఱు హాకికతుని రీతి "ధర్మత్యాగమునకంటె మరణమే శ్రేయమని" చెప్పఁగల్గుదురు? కేవలము చెప్పుటకే కాదు. తాము సత్యమని నమ్మిన ధర్మముల ననుష్ఠిం

పం గల్గుదురు? చల్లని బ్రిటిషు పరిపాలన మున భారతీయులందఱికిని తమ తమ స్వధర్మముల ననుసరించుటకు స్వేచ్ఛ కలదు గదా? ఎందఱు తాము సత్యమని నమ్మెడు సిద్ధాంతముల ప్రకారము తమ జీవన యాత్రం గడపుచున్నారు? మన దేశమునందలి జనులలో నమ్మకమునకును ఆచరణమునకును చాల వ్యత్యాసము కన్పడుట లేదా? మన మెప్పుడు హకీకతునివలె మనయొక్క సత్యనిష్ఠ చేతను ధర్మాచరణము చేతను ఈశ్వర భక్తి పారవశ్యము చేతను మన భారతవర్షమునకు గౌరవమును, మన యార్య జాతికి ప్రఖ్యాతియును, మన యుపనిషణ్మతమునకు నూతన తేజస్సును తేఁగల్గుదుమో అపుడే మనము జన్మసాఫల్యత నొందు

దము. కేవలము శుష్క వచనములతోఁ ప్రయోజన ముండదు గదా!

శ్లో॥ శ్రేయాన్ స్వధర్మో విగుణః
పరధర్మా త్స్వనుష్ఠితాత్ ।
స్వధర్మే నిధనం శ్రేయః
పరధర్మో భయావహః ॥ గీత



# అపూర్వసహనము

# అకుంఠితభక్తి.



## భాయితరుసింగుని సచ్చారిత్రము.

భారతవర్షమున మహమ్మదీయ పరిపాలనము క్షీణదశలోనున్నపుడు అన్యదేశీయులు మనదేశమును జొచ్చి ఆక్రమణము జేసికొనుటకు ప్రయత్నములు జేయుచుండిరి. ఆకాలమునందే పంజాబునందు శీఖులును, మధ్యదేశమునందు జాట్ వంశీయులును, దక్షిణమున మహారాష్ట్రులును మిగుల పరాక్రమముతో విజృంభించిరి. ఇఁక వైదేశికులన్ననో తమశక్తి సామర్థ్యములచేత పరిపూర్ణముగ మొగల్ సామ్రాజ్యము గడగడలాడునటుల చేయఁగల్గిరి. ఈతరుణ

మును కనిపెట్టి జాట్ వంశీయులు తమ రాజుల యధీనమునుండియు, మహారాష్ట్రులు తమ దుర్గమపర్వత స్థానములనుండియు మొగలాయి రాజ్యమును లుంఠనము చేయుటకు ప్రారంభించి వీలయినంతమట్టుకు మొగలుల గర్వమును చూర్ణముచేయుటకు వెనుదీయరైరి. కాని శీఖులకు మాత్రము సైన్యముగాని, సర్దారులుగాని, దుర్గములుగాని యుండినవికావు. కావున వారుమాత్రము మహమ్మదీయులపై దాడివెడలుటకు సాహసించలేదు. మొగలాయి చక్రవర్తి అజేయులగు మహారాష్ట్రీయులను, జాటులను నణచుటకు శక్తిలేక కేవలము శాంత శమ దమాది గుణోపేతులును, నిస్సహాయులునగు శీఖులపై దుండగములు చేయనారంభించెను; మఱియు శీఖుజాతిని సమూల

ముగ నుత్పాటనముఁ జేయుటకు కృతసంక
ల్పుఁడయ్యెను.

బాందాయొక్క అనుచరవర్గమునకును
గురుగోవిందుని శిష్య సమూహమునకును
మైత్రిలేక వారలలో పరస్పర కలహములు
తటస్థించుచుండెను. ప్రప్రథమమున కొంత
కాలము బాందా మొగలులతో బోరి కృత
కార్యుఁడగుటచే మొగలాయి చక్రవర్తికి
బాందా యన్న నెంతమాత్రమును సరి
పడకుండెను. బాందా చంపఁబడినతరువాత
నాతని యనుచరులపై మొగల్ సామ్రా
జ్యాధిపతియొక్క క్రోధాగ్ని ప్రజ్వలిత
మాయెను. పందొమ్మిదివ శతాబ్దారంభ
మున లాహోరు నగరమునకు ఖాన్ జహాన్
అను నాతఁడు శాసనకర్తగా నుండెను.
వాఁడతిక్రూరుఁడును దయావిహీనుఁడునై

యుండెను. ఆతఁడు తనయధికారమునకు లోఁబడిన దేశమంతటను నేగ్రామమునగాని శీఖులను వాసము చేయనియ్యఁగూడదనియు ఎవరైన నాగంతుకముగ వచ్చుట తటస్థించిన యెడల వానిని తక్షణమే శాసనకర్తయొక్క యధీనము చేయవలసినదనియు గ్రామోద్యోగియుల కందఱికిని యాజ్ఞాపత్రములను బంపుటయేగాక గ్రామ గ్రామము నందును నాయాజ్ఞనే చాటింపించెను. మఱియు నెవరైన శీఖునియొక్క తలను దెచ్చినయెడల బహుమాన మియ్యఁబడుననియుఁ దెలియఁజేసెను. ఆతఁడు శీఖులమేలు గోరి ఎవరయిన నుపకారము చేయువా రుండిన యెడల వారిని గూర్చి తెలిసికొను నిమిత్తమై గూఢచారులను సయితము నియమించెను. ఈవిధముగ గోవిందసింగుని

శిష్యకోటిని ధ్వంసము చేయు మార్గములు పరిష్కరింపఁబడినవి. దీనికి ఫలితముగ తరళమతులగు ననేక శిఖ వంశీయులు అల్పవిశ్వాసులగుటచే శిఖ ధర్మమును త్యజించి ఇస్లాం ధర్మమును స్వీకరించిరి. సాహసవంతులగు వారు దేశమునుండి బహిర్గతులయి వనములంజొచ్చిరి; మఱియు వారలలో ననేకులు స్వధర్మరక్షణార్థమై తమ ప్రాణములను బలిగనర్పించిరి. తేజోపూరితులును, విశ్వాసము గలవారునగు నేశిఖులు వనములంజొచ్చిరో వారందఱును ఒక్కటిగఁగూడి నొక సైన్యమును తయారు చేసిరి. వీరికే "ప్రాన" యని పేరు. ఈ యసహాయులును, నిరాశ్రయులునగు సైనికులు భోజనసామగ్రి లేక మిక్కిలి కష్టపడుచుండిరి. కావున తక్కిన శిఖులు వారి కప్పుడప్పుడు సహాయము చేయుటఁ

గలదు. ఈ "పాన్థ" దళమే గురుపదమున కుత్తరాధికారి యగుననియు వారనుకొనుచుండిరి. కాబట్టి శీఖ్ జాతీయు లందఱును వారిని సన్మానించుచుండిరి.

'భాయి తరుసింగు' అనునాతఁడు విధవ యగు తల్లితోడను అవివాహితయగు తన సోదరితోడను పంజాబుదేశమున నొక చిన్న గ్రామమున వాసము చేయుచుండెను. శీఖుల కతియాపత్సమయమగు నాదినములలో తరుసింగు ప్రాయ మిరువది యైదువత్సరములు మాత్రమే. అతఁడు వ్యవసాయము చేసికొనుచు దానివల్ల లభించు కొలఁది యాదాయముచే తనకు చాలక పోయినను పరసేవార్థము వినియోగపఱచుచుండెను. వానితల్లియు సోదరీమణియు నాగ్రామమునందలి ఒక సంపన్నుని గృహమున వడ్లుదంచి, జీవనము

నతికష్టముతో గడపుకొనుచుండిరి. కాని యీవిధముగ సాంసారికావస్థ హీనముగ నుండిన మాత్రమున వారికి లోపమేమి? వారి హృదయములును, మనస్సులును కేవలమైశ్వరిక ధనముచేతను, సంపదతోడను పూర్ణముగ నుండెను. శీఖు గురువుల యుపదేశములనుగాని లేక మఱియేధర్మ గ్రంథములనుగాని జదువని దినము వారి కొక్కటియైన నుండెడిది గాదు. తరుసింగుని హృదయము మిగుల పవిత్రతా ద్యోతకమగు దీప్తితోడ పూర్ణము. అతని యొక్క చరిత్ర యన్ననో కళంకరహితము. ఆతనికి ధర్మమునందు గభీర విశ్వాసముండి యుండుటచే ప్రజలయొక్క దార్జన్యమును, భూలోక సంపదలను, ఆపదలను లక్ష్యపెట్టు వాఁడు కాడు. తరుసింగు

"పాన్ధ" దళమునకు ధాన్యము నిచ్చి సహా యము చేయుచున్నాఁడని లాహూరునం దలి శాసనకర్తకు తెలిసినంత మాత్రమున వానిని బంధించి తెచ్చుటకయి కొందఱు సర్దారులు పంపఁబడిరి. ఆసర్దారులు తరుసిం గుని గృహముప్రవేశించఁగనే నాతఁడు తనం తటనే వచ్చి సర్దారుల వశమాయెను. ఆత నిని సర్దారులు బంధించి తీసికొనిపోవుచుండ మార్గమధ్యమున కొందఱు శీఖులు తరుసిం గును రక్షింపయత్నించిరి. కాని అందున కాతఁడొప్పుకొనక వారితో నీవిధముగఁ బ ల్కెను. "ఒకవేళ మీరు నన్ను యీసర్దా రుల వశమునుండి విడిపించఁగల్గినను, వారి వెంట నిశ్చయముగా రానున్న అసంఖ్యా కులగు ముసల్మాను సైనికులనుండి మీరు నన్నెటులఁ గాపాడఁగల్గుదురు! వారు ఈగాని

మము మీదికివచ్చిన మీకందఱికిని ముప్పా
వాటిల్లును. భ్రాతృలారా! గృహములకు
మఱలిపొండు. నన్ను విడిపించుటవలనఁ
బ్రయోజనము లేదు! నేను నిర్దోషినగుటచే
శాసనకర్తయే నన్ను విడిచిపెట్టునని యూ
హఁగొనియెద. ఒకవేళ నాకు విముక్తి కలుఁ
గకపోయినను అసాంఖ్యాకులగు మీకందఱి
కిని నాశనముఁగలుఁగఁజేసి నేను బ్రతుకఁగో
రను. నేనీభూలోకమున చిరకాలముండుట
కు రాలేదు. ఋషులు, మునులు, మహాపురు
షులందఱును ఈనశ్వరదేహంబు వదలియే
పోయిరి. నేనును ఒకదినమున దీనిని త్యాగ
ముచేసెదను. మన గురువులు ధర్మ ప్రచా
రము నిమిత్తమయి యెంత క్లేశమును సహిం
చి యుండలేదు? ఘాతకులచే వారిబిడ్డలు
చంపఁబడుటనుసహా వారు చూడవలసి

వచ్చెనుగదా. వారియొక్క యపూర్వదృష్టాంతములనైనఁ జూచి మనము గాఢవిశ్వాసముగల భక్తులవలె కార్యక్రమమునకు దొడంగనిచో నంతకన్న యత్యంత పరితాపకర విషయము మఱియొకటి యుండదు."

ఆహా! భక్తులన్న నిట్టివారేగదా! వైరాగ్యమనిన కేవలము విషయ వాంఛలందాసగొనక యుండుట యేగాక, సమయము తటస్థించినపుడు ధర్మవీరుఁడగు తరుసింగునివలె ధైర్యమును వహించి, ఈశ్వరుని మంగళ విధానమును గుర్తెఱిఁగి, గాఢతరమగు విశ్వాసముతో నాపదలకు గుందక, కష్టములకు జంకక, ప్రాణత్యాగమునకైనను సిద్ధపడియుండుటయే గదా! ఓ భారతవర్షమా! నీయనన్య వైరాగ్య శీలురగు పుత్రులే మయిరి!

పైకనిన రీతిని తరుసింగుని యుత్సాహ పూరితమును, భక్తి వైరాగ్యోద్రేకములగు యుద్దేశములను విని సమానగతులయిన శిఖులందఱును భాయి తరుసింగును ఆశీర్వదింప ఈశ్వరుని వేడి, యామహాభక్తుని యుపదేశములను శిరోధార్యముగఁ జేసి తమ తమ గృహములకుఁ జనిరి. తరుసింగును లాహూరు నగరమునందలి చెఱసాలలో నుంచి మఱునటి దినము ప్రాతఃకాలమున రాజదర్బారునకుఁ దీసికొని పోయినప్పుడు, రాజగృహమును ప్రవేశించి నంతమాత్రమున తరుసింగు "శ్రీవాగురు జీకిఖాల్సా, శ్రీవాగురు జీకిఫతే" అనగా పరమేశ్వరునికి జయమగుగాక యని యర్థమిచ్చునటుల గంభీరనాదము చేసెను. ఆనాదమును విని దర్బారు గృహము కంపమెత్త శాసనకర్త

కోపకషాయిత లోచనుఁడయి తరుసింగు వంక దృష్టినిగిడించి యేమో చెప్పఁబోవు చుండ, నాతఁడు శాసనకర్తను మార్కొనఁడ నియ్యక "నేను నీకేమి కీడుచేసినందుకై, ఈ యవస్థసంభవించినది ? నేను దరిద్రుఁడను; వ్యవసాయము చేసికొని బ్రతుకుచున్నా డను; నియమిత రూపముగ దొరతనము వారికి పన్నులు చెల్లించుచున్నాడను. మఱి యే స్వల్పమైన మిగిలినచో దానితో దాన ధర్మములు చేయుచుందును. నావిషయమై దౌర్జన్యమునుచేసి పాపమున కొడిగట్టుకొన వలదు. ఏరాజు అన్యాయ కార్యములందు ప్రవృత్తుఁడగునో వాఁడు నరకమును పొందు నని సర్వధర్మములు నుద్ఘోషించుచున్నవి" యనెను. తరుసింగునియొక్క యీ వాక్య ములు వినిన శాసనకర్త మండిపడి వాని

దేహమును శూలములతో పొడిచి బాధిం చునట్లాజ్ఞాపించెను. తరుసింగుని దేహమంతయు క్షితవిక్షితమై సర్వాంగములును రుధిరధారలతో ప్లావితమగుచుండెను. అప్పటికిని ఆతని ముఖమునుండి బాధను సూచించువాక్యములు బయలువెడలనే లేదు; ఆతని ముఖమండలమే మాత్రమును వాడక అపుడే పుష్పించిన కమలమువలె ప్రకాశించుచుండెను. అతడు క్రమాగతముగ నా యేకమాత్రుడును, నిత్యనిరంజనుడును, ఆ కాలపురుషుడునగు పరమేశ్వరుని నామోచ్చారణమే చేయుచుండెను. రెండుఘంటల కాల మీ విధముగ నసహనీయమగు బాధకు లోబడిచిన తరువాత ఘాతకులు విసికి, శక్తి లేక తరుసింగును మఱల కారాగారమున నుంచిరి. మఱుదినము ప్రాతఃకాల

మున నాతఁడు మఱల రాజదర్బారునకు తీసి కొనిపోఁబడెను. ఇంతలోపల తరుసింగుని యపూర్వమగు నీబాధనిర్వహణ శక్తిని గూర్చి విని యాశ్చర్యాన్వితుఁ డయ్యెను. ఇటువంటి మానవుని ముసల్మాను ధర్మ మున జేర్చిన, నాతఁడు మహమ్మదీయులలో నగ్రగణ్యుఁడు కాఁగలడనితలఁచెను. కావున నితని నిఁక బాధలు పెట్టుటమాని ప్రలోభన ములచే వశపఱచుకొనయత్నించెను. ఆతడు తరుసిఁగుతో "నీవు ఇస్లాంమతమును అవ లంబించితివేని నీకేవిధమయిన బాధలు కలు గనేరవు" అని నమ్మకము కలుగునటుల చెప్పెను. కాని తరుసింగామాటల నెంత మాత్రమును లక్ష్యపెట్టలేదు. "నేను విశ్వాసఘాతకుఁడనయి ప్రాణమును కాపా డుకొందునా? అట్లెప్పుడును పొసగనేరదు.

నాతలనైన నిచ్చి నాయొక్క వేణియును ధర్మమును కాపాడికొందు" ననెను. మఱల శాసనకర్త "చూచితివా! నీమతము నీకెంతబాధను కలుగజేయుచున్నదో? సుఖమును కలుగజేయుటలేదు గదా, మీదుమిక్కిలి నిన్ను దారిద్ర్యమునందుంచి నానావిధములగు క్లేశముల చింతల పాలుఁజేసి నిన్నెంత యోడించుచున్నది. నీవు ముసల్మానుఁడవగుదువేని యెంతయో సుఖము ననుభవింతువు. మఱియు లోకమున ధనికుఁడవనియు, గౌరవనీయుఁడవనియు గణ్యతను గాంతువు. నేను నీకియ్యనున్న ధనము నీవు యౌవనకాలమున సుఖము ననుభవించుటకే గాక వృద్ధాప్యమున సుఖజీవనము సల్పుటకును సహాయకారి యగును" అనెను. అందునకెంత మాత్రమును తరు

సింగు ఒప్పుకొనక "నేనెప్పుడును స్వధర్మ త్యాగినై తురుష్కుఁడనుగాన" ని బదులు చెప్పెను. ఈస్వధర్మ పరాయణత్వమును జూచి శాసనకర్త మిక్కిలి కుపితుఁడయి తరుసింగుని కాళ్లుచేతులను బాగుగా నొక బండి చక్రమునకు త్రాళ్ళతో బిగియఁగట్టి ఘాతకులచే చక్రమును త్రిప్పించెను. తరు సింగుని దేహమాక్రూర కృత్యమువలన నిశ్చేష్టిత మయినను ఆతడుమాత్రమొక్క దీర్ఘ నిశ్వాసమును గాని ఒక్కకన్నీటిబిందు వును గాని వదలినవాఁడు కాకపోయెను. అంతియేగాక ఆతనియొక్క శారీర బాధచే త నాతని ధర్మోత్సాహము ద్విగుణమగుచు వచ్చెను. ఆతనియొక్క యపూర్వసహన మును, నిరుపమానమగు ధర్మవిశ్వాసమును జూచిన ఘాతకులును శాసనకర్తయును

విస్మయాప్లుతులైరి. ఎవనియొక్క బలము క్లేశమున కోర్వగలిగెనో ఆరహస్యము శాసనకర్తకు తెలియలేదు. ఎవరికొఱకు తరుసింగు యింతబాధ ననుభవించుచుండియు చలింపక యుండెను? ఇంతటి కష్టసమయమున సహితము నవబలమును సమకూర్చి యానందమును సమకూర్చిన ఘనుడెవ్వడు? ఆతఁడే సర్వేశ క్తుడైన పరమేశ్వరుఁడు. ఎవడు మనహృదయసీమలయందు ప్రకాశించుటచే మనము ఆనందసముద్రమున నోలలాడగల్గుదుమో, ఏవాడు మనలను స్పర్శించినంత మాత్రమున మనకు దేవత్వలాభము కల్గునో మఱియు మితిలేని శక్తివంతు లగుదుమో, యాపరమపురుషుని సాంగత్య విశేషముననే భాయి తరుసింగు అన్ని బాధలను భ

రించి నిశ్చలుడై యుండఁగల్గెను. ఆమహామ
హుని కృపచేతనే తరుసింగు ఇహలోక కష్ట
ములను సరకుగొనక పారలౌకిక సంపదకై
యెదురుచూడగల్గెను. వానిని చక్రమునుం
డి దింపిన తరువాత మఱలయొకతూరి శాసన
కర్త తరుసింగును సమీపించి "శిఖధర్మ
మును-వదలుము. ముసల్మానుడవు కమ్ము.
లేనిచో నీయొక్క వేణి కత్తిరించి వేయఁ
బడు" నని జెప్ప, నాశూరాగ్రేసరుఁడు "అ
టులనేకానిండు. కాని నాయొక్క మస్తక
మును వేణినికూడ నొక్కపర్యాయము
తీసికొనుఁడ"ని ప్రత్యుత్తరమిచ్చెను. అటు
పిమ్మట మఱియొక్కతూరి వానిని బాధపె
ట్టిరి. కాని యాభక్తవీరుని ముఖకమల
మేమాత్రమును వాడక కన్నీటి బిందు
వొక్కటైనను బయలువెడలక పూర్వమే

యీసాధు పురుషుని యపూర్వావస్థను జూచిన శాసనకర్తయును, తక్కిన ముసల్మానులును భయకంపిత మానసులై తరుసింగుని చక్రమునవిడి మఱల నొక పర్యాయము దింపి మరణావస్థలోనుండు యాభక్తుని శిఖులవశము జేసి అచ్చటనుండు పలాయనులయిరి. తరుసింగును చేరువనున్న నొక ధర్మశాలకు తీసికొనివెళ్లి శిఖులు సేవాశిశ్రూషలను సల్పిరి. అచ్చటనే కొన్ని దినములు చావు బ్రతుకుల మధ్యనుండి భాయి:తరుసింగు అమరధామమున కేగెను.



# మృత్యువును జయించుట.



## సుబేగ్ సింగుని జీవన చారిత్రము.

లాహూరు నగరవాసియగు ఖాయఁసు బేగ్ సింగు జాట్ వంశీయుడు. వాని పూర్వ పురుషులు పలుకుఁ బడితనము గలవారును రాజకీయోద్యోగము లందుండి జీవనము గడపువారునై యుండిరి. అతఁడు లాహోరు శాసనకర్తయొక్క పారిషద్వర్గములో చేరినవాఁడగుటచే నాతఁడు పనే యనెడి గ్రామమునుండి కుడిఖానా యను గ్రామమునకు శాసనకర్తగా బదలాయింపఁబడెను. అతఁడు పారశీభాషను చక్కఁగా నేర్చి యుండుటయే గాక తన స్వశక్తిచే గురు

ముఖీభాషను సహితము నేర్చుకొనెను. ఈ
రెండుభాషలయందును నాతనికి ప్రవీణత
యుండినందున అది యెంతయో నాతనికి
సహాయపడినది. శీఖ్ మత విషయమై యె
ప్పుడయినను వాగ్వాదములు తటస్థించిన
యెడల ముసల్మాన్ యుద్యోగియులు ఆవిష
యమై యాతనితో పరామర్శఁజేయుచుం
దురు. అప్పటి ఢిల్లీసార్వభౌముఁడగు మహ
మ్మదుషహా శీఖ్ ధర్మమునందు తనకుఁగల
సానుభూతిని తెలియఁజేసి ఖాన్ సుబేగ్
సింగును మిక్కిలి గౌరవించుచు అతనియొ
క్క స్థితిని బాగుపఱచెను. సుబేగ్ సింగునకు
సహ్బాసింగు యనెడి పుత్రు డొకఁడు గలడు.
ఆతఁడు తన కుమారునికి పారశీ భాషయం
దున్నత విద్య నిప్పించుటయేగాక గురుము
ఖీభాషలో సహితము అతనికి ప్రవేశము

గలుగునటులచేసెను. సజ్జా సింగుయొక్క విద్య పూర్తియగు కాలమున నాతనికి పదు నేనిమిది వత్సరముల వయస్సు. ఆసమయా మున నే ఒక దినమున నాతనికిని అతని యుపా ధ్యాయునికిని మతసంబంధమయిన చర్చజరి గెను. ఆకాలమున హిందువులకును మహా మ్మదీయులకును మిక్కిలి శత్రుత్వ మగుటచే ప్రతిహిందువు ప్రతిమహామ్మదీయుని తన శ త్రువుగా భావించుకొనుచుండెను. మఱియు ప్రతిముసల్మానుఁడును ప్రతిహిందువుపై ద్వే షమును వహించి అదేతీరుగ పగసాధింప యత్నించుచుండెను.

దీనికి పూర్వశతాబ్దమునందు ఔరంగ జేబును, అతని యుత్తరాధికారులును హిం దువులపై మిక్కిలి దౌర్జన్యములను నెరపిరి. శిఖులును ముసల్మానులను నానావిధముల

బాధలు పెట్టిరి. ఈ కాలమున మొగల్ సామ్రాజ్యాధిపతి మిక్కిలి దుర్బలుఁడగు నందున దాదాపు అన్ని ప్రదేశములందును సామర్థ్యముగలవారును దుర్మార్గులును దౌర తనమువారి కెదురు తిరుగ నారంభించిరి. కావున నిట్టియల్లరి సమయమున మతసంబంధమయిన చర్చలు జరుగుట స్వాభావికమే. దౌర్భాగ్యవశమున గురువునకును శిష్యునికిని ఒండొరులపై కొంత యసద్భావము జనించినందున ఉపాధ్యాయుఁడు క్రోధపరవశుఁడై అచ్చటి శాసనకర్త కాసంగతిని తెలియఁజేసెను. అందువలన సుబేగ్ సింగును అతని పుత్రుఁడు సబ్బాసింగును బంధింపఁబడి విచారణ నిమిత్తము రాజదర్బారునకు తీసికొని రాఁబడినపుడు వారు ఇస్లాం ధర్మమును స్వీకరింతురేని వదలి పెట్టఁబడు

దురని తెలియఁజేసిరి. ఆమాటలను వినిన సుబేగ్ సింగు ''మీ యొక్క దండము ధన్యమగుఁ గాక ! ఈసమయమును ధన్యమగును గాక! మీయొక్క చక్రయంత్రమును ధన్యమే యగును. మఱియు ధర్మము నిమిత్తమై క్షయముగాఁబోవు ఈ నాశరీరము సహితము ధన్యతఁగాంచును. ముసల్మానులమైన యెడల మేము మృత్యుముఖమునుండి తప్పించుకొనఁగల్గినచో అదియు కొంతవఱకు మంచిదియే. కాని ముసల్మానుల మయినను ఒకదినమున మృత్యువు వాతఁ బడవలసియే యున్నారము. కావున మేము ప్రాణ సంరక్షణార్థమై ధర్మమును త్యజించుట యెందుకు?'' అనెను. మతము కొఱకయి ప్రాణములను విడిచిన బహుసంఖ్యాకులగు శీఖులను శాసనకర్త చూచియుండెను. కాని సుబేగ్

సింగుని వలె ముసల్మాను ధర్మమునందలి యభిజ్ఞత గలవా రెవరును ఇస్లాంధర్మము నింతవఱకు దూషించియుండుటను నెఱుఁగఁడు. కావున శాసనకర్త దిగ్భ్రమఁజెందిన వాఁడాయెను. ఆతఁడిన్ని దినములును కేవలము పామరులును ఇస్లాంధర్మమునందనభిజ్ఞులుమాత్రమే వాని మతమును దూషించుచుండిరని తలఁచెనుగాని సుబేగ్ సింగువంటి పండితుఁడు మహమ్మదీయ మతమును దూరునని యెన్నఁడను కొనలేదు. కావున శీఖ జాతినంతయును సమూలముగా నాశనముఁ జేయ శాసనకర్త సంకల్పించు కొనెను. ఆతఁడు తక్షణమే ఘాతుకులను పిలిపించి సుబేగ్ సింగు, షబ్బాసింగులను చక్రయంత్రములపై నెక్కించి మితిలేని బాధలను పెట్టుమని యాజ్ఞాపించెను. వా రిద్దరన్నదో

"అకాల; అకాల" అని అకాల పురుషుఁడగు పరమేశ్వరునినామము నుచ్చరింపసాగిరి. ఇట్లు ఒక ఘంట కాలము బాధపెట్టఁబడినతరువాత కొంతకాలము విశ్రాంతి యియ్యఁబడినది. మఱల వారినేక ప్రలోభములచే లోంగించుకొనఁజూచిరిగాని వారికి ధర్మమునందలి విశ్వాస మేమాత్రమును తగ్గలేదు. అంతట శాసనకర్త సబ్జాసింగును పిలిచి "బాలుఁడా, నీతండ్రి ముసలివాఁడు. అతడు సమస్తభోగములను అనుభవించిన వాఁడు కాన నాతనికీ జీవితమునందలి యాస లేక చనిపోఁగలఁడు. నీవన్ననో యల్పవయస్కుఁడవు; నీవింకను ప్రాపంచిక సుఖముల నేవియు రుచిఁగొనలేదు; నీవెందు కీవిధముగ మృత్యువును ఆలింగనము చేసికొనుచున్నావు? నీవు ముసల్మానుఁడవగుదువేని రక్షింపఁ

బహుదువు. మఱియు సర్వవిధములగు సుఖ
ముల ననుభవింపఁగలుగుదువ' నెను. సభా
సింగందునకు 'నేను ధర్మత్యాగమును చేయ
ను,' అని గంభీరముగా నుత్తరమిచ్చెను. ఈ
మాటలను వినిన శాసనకర్త ఆబాలుని నొక
స్తంభమునకు కట్టి గుఱ్ఱపుకొరడాతోఁ గొట్టు
నట్లును, మఱియు నెఱ్ఱని ఇనుపకడ్డీలతోఁ
నాతని దేహమున వాతలు వేయునట్లును
నాజ్ఞాపించెను. తత్క్షణమే యావిధముగ శాస
నకర్తలయొక్క యాజ్ఞ పరిపాలింపఁబడె
ను. అప్పుడా బాలుడు బాధలకు తాళఁజా
లక భయకంపితుఁడై 'నన్ను వదలిపెట్టుఁడు!
నన్ను వదలిపెట్టుఁడు! నేను ముసల్మానుఁడ
నయ్యెద' నని కేకలు వేయసాగెను. శాసన
కర్త యాబాలకుని మొఱలకై యానం
దించి సుబేగ్‌సింగును బిలిపించి యాతని

పుత్రుని యొక్క మతపరివర్తనవార్త నాతనికిఁ దెల్పెను. ధర్మజ్యోతితో దేదీప్యమాన మగుచుండెడి తన తండ్రియొక్క ముఖమండలమును జూచినంత మాత్రమున సజ్జాసింగునకు మృత్యుభయము లేకపోయెను. అప్పుడు సుబేగ్ సింగు 'పుత్రుడా! ఎవరికిని నీదేహము శాశ్వతము కాదు. నీవు మృత్యుభయముచే భీతుఁడవు గాకుము. ఏలయన మనయొక్క యాత్మ చిర (యమర) జీవనము గలది. ఎవరు దేహమునకంటె ధర్మమే యమూల్యమని తలఁతురో వారే యమర జీవులగుదురు. ప్రహ్లాద, మణిసింగు, హరిశ్చంద్ర మొదలుగాగల భక్తు లెట్టి స్వార్థత్యాగమును మతముకొఱకై చూపిరో తలఁచుకొనుము. వారియొక్క యాత్మోత్సర్గమెట్టిది? ధర్మమే వారిని

ఇహలోకమున సన్మానపాత్రులుగఁ జేసి పరలోకమున సద్గతిప్రధానము చేసినది." అని తన కుమారుని ధర్మవిశ్వాసము నిను మడింపఁజేసెను. మొట్టమొదట సుబేగ్ సింగుని మాటను శాసనకర్త రహస్యముగ నాలకించుచుండెను గాని యెపుడామాటలు సబ్జాసింగుని హృదయములో నాటి యతనికి మఱల ధర్మవిశ్వాసము కుదురునని భయముగలైనో యపుడు వానిని తండ్రితో మాటాడకుండునటుల నివారించెను. సుబేగ్ సింగు సబ్జాసింగును వదలిన తరువాత నాతఁడు శాసనకర్తతో "నేను బుద్ధిహీనుఁడను. నీమాటలచే మోసపోతిని. నా ప్రాణమును తీసికొనుము. నేను దృఢముగా ధర్మమునే అవలంబింతు" ననెను. ఆమాటలకు అలిగిన శాసనకర్త మఱల నొకతూరి సబ్జా

నాకర్షించఁగలుగును. అట్టివారి సాంగత్యవిశే
షముచేతనే సామాన్యమానవులు ఈశ్వరు
నివంకకు తమ దృష్టినిఁ ద్రిప్పఁగలుగుదురు.
అట్టివారి చరితములనే మన మీ చిన్నిగ్రంథ
మున జదువఁ గల్గితిమి. వారి జీవితములం
దలి విశేషత్వమేమి? వారు అసహనీయ
మగు బాధలనొందియు కలకుతురకల మొ
లకుతనమున కించుక యయినను వెఱువక
సంతోష పూర్వకముగ మృత్యువు నాలిం
గనమును జేసికొనునంతటి శక్తి వారి కెటుల
లభించినది? వారికింగల ప్రబల ధర్మవిశ్వా
సమునకు మూలమేది? అనెడి ప్రశ్నలు
ప్రతి యాలోచనపరునికిని స్ఫురించకమాన
వు. ప్రతి మనుజుఁడును తన జీవితమునం
దొకప్పు డయినను ధర్మజ్యోతిని దర్శించి
ఈశ్వరవాణి నాలకించి ఆత్మానందము నిం

